# కోలాటము పాటలు
# ఇతర భజనలు

సేకరణ :

ఆరతీమూర్తి

వికాస్ పబ్లిషింగ్ హౌస్
సూర్యారావుపేట, విజయవాడ-2

కోలాటము పాటలు
ఇతర భజనలు

సేకరణ :
ఆరతీమూర్తి

ప్రథమ ముద్రణ
1990 జనవరి

వెల : 3-00

ప్రచురణ :
వికాస్ పబ్లిషింగ్ హౌస్
సూర్యారావు పేట
విజయవాడ - 520 002

ముద్రణ :
పద్మజ ప్రింటర్స్ & బైండర్స్
విజయవాడ - 520 010

# కోలాటము పాటలు

## ఆంజనేయ రావణ సంవాదం

యేదేశ పరుడవో ।యేదేశ। య్యేరాజు బంటువో
యెందుండి వస్తివిర వోరీ వనచరీ ॥యెందుండి॥
స్రుంగారి వనములో సీతమ్మ వుందనీ
సూడబోయొస్తిరా వోరీ

యేడేడు సముద్రాలు ॥యేడేడు॥ యేకమైపారంగ
నువ్వెట్ల వస్తివిర వోరీ వనచరీ ॥నువ్వెట్ల॥
నీ కేడు సముద్రాలు నాకేడు కాలవలు
యెనికి లగుపుతొ వస్తినిర వోరీ

యేటి గట్టున వుండే ॥యేటి॥ మేటీ కుంబాకర్ణు
డ్వాడెట్లు రానిచ్చెరా వోరీ వనచరీ ॥వాడెట్ల॥
యేటి గట్టున వుండె మేటి కుంబాకర్ణు
మెదడెల్ల దొక్కొస్తి రా వోరీ

గవిని గాసేవోళ్ళు గవిని ॥వాళ్ళెట్ల॥
సినలంకి పెదలంకి రానిచ్చిరా వోరీ వనచరీ ॥వాళ్ళెట్ల॥

లంకిణీ చెయ్యిబట్టి కంకణము యమ బులిమి
యమలోక మంపిస్తిరా వోరీ

నీయంటి బలశాళ్ళు ॥నీయం॥
నీయంటి మొనగాళ్ళు యింగెంద
రుందరోరీ వనచరీ ॥యింగెంద॥
నీయంటి బలశాళ్ళు నాయంటి దాసర్లు
కోటాన కోట్లురా వోరీ

మాటి మాటికి నన్ను మాటి మాటికి నన్ను
వోరోరి అంటావు యేరాజు బంటువుర వోరీ ॥యేరాజు॥
శ్రీ:రామ బంటుణ్ణి మా రాజు సుగ్రీవులు
అంజనా తనయుడు అనుమన్న నాపేరు వోరీ

మీ పట్నమూలోన మీ పట్నమూ లోన
యిట్లాంటి రచ్చలూ యెన్నెన్ని గలవురా వోరి ॥ఎన్నెన్ని॥
మా పట్నమూలోన మా పట్నమూలోన
యిట్లాంటి రచ్చలు జాలారి బండలేర వోరీ

మీ పట్నమూలోన మీ పట్నమూలోన
యిట్లాంటి మేడలూ యెన్నెన్ని గలవుర వోరీ ॥యెన్నెన్ని॥
మా పట్నమూలోన మా పట్నమూలోన
యిట్లాంటి మేడలూ బొమ్మరిండ్లే నేర వోరీ

మీ పట్నమూలోన మీ పట్నమూలోన
యిట్లాంటి వనములూ యెన్నిన్ని గలవుర వోరీ ॥యెన్నెన్ని॥
మా పట్నమూలోన మా పట్నమూలోన
ఇట్లాంటి వనములూ కూరాకుపాదులేర వోరీ



"వాలినేమో చంపినాడూ వారధీ గట్టించినాడూ
వారధీ ముగిసేటి తలికే లంకకీ రవధూళి గప్పె"

## అంగద రావణ సంవాదం :

"సిరిదేవి సీతనూ సెరదెచ్చి నావురా
చెడిపోకు మోరోరి చెవిబెట్టు నా మాట వోరీ
రావణా చెవిబెట్టు నా మాట వోరీ

నా కొల్వు లోపలా నాకు బుద్ధులు జెప్ప
యేపాటి వాడవుర యేరాజు బంటువుర వోరీ
వనచరీ యేరాజు బంటువుర వోరీ

శ్రీరామ బంటుణ్ణి మా రాజు సుగ్రీవులూ
అంగదుడు నా పేరు మా తండ్రి వాలిరా వోరీ
రావణా మా తండ్రి వాలిరా వోరీ

బలశాలి వాలికి సెడ బుట్టి నావురా
పగవాని కొలువులో బానిసల బతుకేల ఓరీ
వనచరీ బానిసల బతుకేల ఓరీ

జగము పాలించేటి జగదీశ్వరుడు
మాపాలి పరమాత్మ పగవాడు గాదురా ఓరీ
రావణా పగవాడు గాదురా ఓరీ

యెక్క గుర్రాలిస్తు యేనుగలనిస్తురా
యేల బూమూలిస్తు యెలనాగ లిస్తురా ఓరీ
వనచరీ యెల నాగలిస్తురా ఓరీ

కోటాన కోట్లుగా కోటి దండు దళము
కోదండ రాములూ కదిలివొస్తారు ఓరీ
రావణా కదిలివొస్తా రోరీ

నల్ల జీమల్లట్ల నరుల నలిపేపిస్తు
కోతిమూకల జంపి గోరీలు కట్టిస్తురా ఓరీ
వనచరీ గోరీలు కట్టిస్తురా ఓరీ.

## లక్ష్మణ మూర్ఛ:

"హేబళా శ్రీబళా హేబళా శ్రీబళా
యేసెనే యింద్రజితువూ
యేసెనే యింద్రజితువూ లక్ష్మణా
అగ్గిబాణము లక్ష్మణా

◆ ◆ ◆

మూర్ఛిలిన తమ్ముని మూర్ఛిలిన తమ్ముని
ముందరేసుకుని మునిగె దుఃఖములో లక్ష్మణా
రాములు మునిగె దుఃఖములో లక్ష్మణా

పుట్టింది నలుగురూ పుట్టింది నలుగురూ
పెరిగింది నలుగురూ పేరు కిద్దరుంటిమి తమ్ముడా
వొంటిగాణ్ణి జేస్తివా లక్ష్మణా

దినదినము నీనాము దిన దినము నీనాము
దిద్దినట్లే వుండె దివ్య రత్నము తమ్ముడా
లక్ష్మణా దివ్య రత్నము లక్ష్మణా

◆ ◆ ◆

యెడము యెడమేగాని యెడము యెడమేగాని
యెదటి కెన్నడురావు తొడలపై కాస్తి వప్పా లక్ష్మణా
ఒడిలోని వొస్తి వప్పా లక్ష్మణా

యెద్దు కొమ్ముల వారు యెద్దు కొమ్ముల వారు
యిద్దరుంటిమి మనము ఒంటిగాణ్ణయితినప్పా
లక్ష్మణా సొంటి తిప్పలొచ్చెనప్పా

కూర్చినా ముత్యాల కూర్చినా ముత్యాల
కుచ్చులాలా మనము కూడివుంటిమి తమ్ముడా
లక్ష్మణా తోడవుంటిమి లక్ష్మణా

దాచిన్న పగడాల దాచిన్న పగడాల
దండలాలా మనము దాగియుంటిమి తమ్ముడా
లక్ష్మణా దాగుకుంటివె లక్ష్మణా

యాడరా లచుమన్న యాడరా లచుమన్న
యాడరా సీతంటె యేమి జెప్పాదు తమ్ముడా
లక్ష్మణా యేమి జేతుర లక్ష్మణా

కొండ గరగర దిప్పి కొండ గరగర దిప్పి
కోనలే దాటేసె కొండతల్లటిస్తాది లక్ష్మణా
తమ్ముడా గుండె తల్లటిస్తాది లక్ష్మణా

పగవాని బాణాలు పగవాని బాణాలు
పైపైన వస్తాయి పల్కవేమిర తమ్ముడా
లక్ష్మణా పారజూడర లక్ష్మణా

పగవాడు గాదన్న పగవాడు గాదన్న
మనవాడె అనుమన్న తెస్తుండె సంజీవినీ
లక్ష్మణా తెచ్చెనే ద్రోణాద్రినీ లక్ష్మణా

  

## సీతా రాముల రాక:

"సూతాము రారోయమ్మ జనులార
సూడబోదము రారోయమ్మ
సీతకు పతియైన శ్రీరామ చంద్రుండు
దశరథుల రగురాము తరలవచ్చేనంట
ఉక్కు గంభము రెండు ఉరమునా పిడుగులూ
సుట్టుజుట్టీనట్టి సుంగారపొనములో
పువ్వులను బంతులను పుప్పటిల్లంగా
రంగురంగులలోన అయ్యాలొస్తారంట
యెక్కువాగు సీరుజల్లి స్తానముచేసి
వీడి వీదిని దాటి నాదిదేవుడు రాగ
నేటించి కుంకుమూ నిర్దలై నల్లగా
గ్రక్కునా నగరికే కదిలి వొస్తారంట
అకాశబాణాలు అమరంగ దిక్కులు
నిగనిగా మునియేటి సీలాల గొలుసులూ
స్వామి ముంద్రా రెండు సంద్ర జోతూలంట
పూలతేరూ మింద పురుషోత్తములు రాగ"

రాముడుండై వద్దిలోనా రత్నాల రవ్వ లెగిసె
రాముడేలే సీమలోనా రాజనాలా పంటబండే

## సీతమ్మ వనవాసం :

అయివొద్ది పట్నాన అదివరిసావిడీ
లవ కుమారా వినుమన్న కుశల కుమారా
సావిడీ వెనకలే సౌకలోరిండ్లమ్మ ॥లవ॥



పగవాణి పంచనా పడివున్న ఆలినీ ॥లవ॥
యెర్రి రాములు గాంగ యేలుతుండాడు ॥లవ॥
నాబోటిగాడైతె నరికి తుండేయేతు ॥లవ॥



పుట్టెడూ బువ్వొండి పట్టెడూ సద్ది ॥లవ॥
ఆసద్ది లేకింగ ఏమేమి కూరలు ॥లవ॥
అటికలతో మాడినవి అలరేణి పండ్లు ॥లవ॥
దుత్తలతో మాగినవి దూదిసిమ్మల్లు ॥లవ॥
ముంతలతో మాగినవి ముంత మామిళ్ళు ॥లవ॥
కొండ ముక్కిడి కాయ గొడిసింత కాయ ॥లవ॥

సద్దెయిన గట్టెనే సకియు సీతమ్మ ॥లవ॥
ఆరెండి అడవులకు ఆ తల్లి బోతాదె ॥లవ॥

  

అట్నుంచి ఆతల్లి అత్తనగరొచ్చె ॥లవ॥
ఆరెండి అడవికీ పయనాలు అత్త ॥లవ॥
యెప్పుడూ తిప్పలూ తప్పలేదమ్మ ॥లవ॥
పాపిట్టి రాములుకు పదినెల్లు గర్భిణీ ॥లవ॥
వెఱ్ఱి రాములకును వెరుతుము చెప్ప ॥లవ॥
సేమాన బోవమ్మ లాబాన రావమ్మ ॥లవ॥

ఏమమ్మ సీతమ్మ యిట్ల వస్తీవీ
వొంటిగా వొచ్చినా వొద్దారయేమీ
కాలి నడకొచ్చిన కారణమేమీ
వాణింటి గుఱ్ఱాలు కూలిపోయిన్న
వాణింటి వొంటెలూ వెట్టి బోయిన్న
వాణింటి పాలకిలు పాడు బోయిన్న
వాణింటి దాసీలు దాడి పోయిన్న
రాస వంశామనీ మోస పోతిని తల్లి
కాసి గోత్రం బనీ మోస పోతిని తల్లి

## గణపతి భజనలు

ఓ గణపతయ్యా గణపతయ్యా
ఉండ్రాళ్ళు నీకు పోతురా
ఓ గణపతయ్యా
మందకొడిగ వుండబోకురా!

ఓ గణపతయ్యా గణపతయ్యా
జమ్మిపత్రి పూజసేతురా
ఓ గణపతయ్యా
ముందె నీకు పూజసేతురా!

ఓ గణపతయ్యా గణపతయ్యా
ఉండ్రాళ్లు నీకు పోతురా
ఊరిలోన ఊరేగించెదరా
ఓ గణపతయ్యా
ఉయ్యాలల ఊపుతానురా!

ఓ గణపతయ్యా గణపతయ్యా
ఉండ్రాళ్ళు నీకు పోతురా
ఓ గణపతయ్యా
నమ్ము ఎపుడు మరువ బోకురా

* * *

ఓ ఇగనరాజ ఇగనరాజ
జమ్మిపత్రి పూజసేతురా
ఓ ఇగనరాజ ||ఓ||

జామిపత్రి పూజసేతురా
ఓ ఇగనరాజ |ఓ|

ఉంౘ్రాళ్లు సీకు పోతురా
ఓ ఇగనరాజ |ఓ|

ఊరిలోన ఊరేగించెదరా
ఓ ఇగనరాజ |ఓ|

ఏయి వరాలో ఏయి వరాలో
ఏకులొడికిన పాప
యఱ్రన్న పాప |ఏయి|

ఆరూగో అన్నల్లు
పచ్చాచున్నారు |ఏయి|

ఆరెందు కొత్తారు
రాజూలశ్ళల్లు ||ఏయి|

రాజూలశ్ళళ్ళయితే
రారంటే పాప? ||ఏయి||

నామాట బోటైతే
మేడెక్కి చూడు ||ఏయి||

ఉల్లిమళ్ళా చీరాగట్టే
కచ్ఛలూ పై కెగా గట్టి
ఊడుపూకీ దిగామంటే
ఉన్నవాళ్లా పిల్లానంటావా!
ఓలోలె గంగీ
ఉన్నవాళ్లా పిల్లనంటావా ?

ఉన్నవాళ్లా పిల్లానంటే
కన్నుగీసే రమ్మన్నావూ
కంటిబాసలు నాకూ ఒద్దురా
ఓలోలె బావా
కంటి ఇరువులు నాకు ఒద్దురా

ఉన్నవాళ్లాపిల్లనసీ
ఉబ్బిపోకే ఓలే పిల్లా
కోతలాకి కోరివస్తేను
ఓలోలె గంగి
కోతలోళ్ళకి కోపమొస్తుందే

## చెమ్మ ఆట పాట

కొండెకూ పూలు చుట్టవే!
అమ్మనన్ను
గోపాల కృష్ణుడనావే!

చిన్నారి నామాలెట్టవే!
అమ్మ నాకు
వన్నెల సొమ్ములెట్టవే!

వీరుడని నన్ను పిలువవే
అమ్మ నన్ను
వీరులా ఖ్యాతి అనవే !

కుచ్చులా జడలు వెయ్యవే!
అమ్మనన్ను
కూర్మావతారుడనవే!

పతకాలు నాకు వెయ్యవే!
అమ్మ నన్ను
అయోధ్య రాముడనవే!

చేతివంకెలు నాకు పెట్టవే!
అమ్మనన్ను
వైకుంఠ వాసుడనావే!

వేలికుంగరం నాకు పెట్టవే!
అమ్మ నన్ను
వెలలేని కృష్ణుడనవే

మొలకు గజ్జెలు నాకు పెట్టవే
అమ్మనన్ను
మోక్షావతారుడానవే!
కాలికందెలు నాకు పెట్టవే
అమ్మనన్ను

కలికావతారుడనావే!
ఒళ్ళంత సొమ్ము వేయవే
అమ్మనన్ను
వజ్రాల వాసుడనావే!
పట్టుపంచెలు నాకు కట్టవే!
అమ్మనన్ను
పార్వతీ తనయుడనావే! ॥కొం॥

(8)

# కోలాటం పాట

అటవీ స్థలముల కరుగుదమా
వటపత్రంబులు కోయుదమా!
జనులారా గుమిగూడుదమా
జటకోలాటము వేయుదమా!
నొకరి నొకరి తా-
నొక కుడియెడమల
నొప్పుగ దీనిని త్రిప్పుదమా!
మంచిగంధమూ తీయుదమా
చెంచిత మెడకిది పూయుదమా!
మల్లెపూవులూ కోయుదమా
మందయానపై జల్లుదమా!
కోతి కొమ్మచ్చులాడుదమా
కోరి వనంబుల చేరుదమా!
దాగుడు మూతాలాడుదమా
తరువుల చాటున దాగుదమా!
విప్పపువ్వులూ ఏరుదమా
విసువక మనమిపుడు పోవుదమా!

## గొబ్బిపాట

గంగమ్మ గౌరమ్మ అప్పసెల్లెండ్రూ
గొబ్బియళ్లో! గొబ్బియళ్లో!!

ఒక తల్లి బిడ్డలకు వైరములేదు ,, ,,
మంచి మంచి పూలేరి ఒకరాసి పోసిరి ,, ,,
కానరాని కలువలేరి ఒకరాసి పోసిరి ,, ,,
ఏడు మూరలింటిలో ఏ డొక్క తూము ,, ,,
ఏ డొక్క తూమేసి ఎల్లా కొలిపించే ,, ,,
పొగిడి ఒక తూమేసి పారాకొలిపించే ,, ,,
గంపెడూ తీసేసి గంగాకెత్తండీ ,, ,,
మంచి మంచి పూలేరి మామయ్యకంపె ,, ,,
కానరాని పూలేరి గౌరమ్మకంపె ,, ,,
అక్కనూ చెల్లినీ ఒక్కరికిచ్చె ,, ,,

ఓ గుర్రాలా గోపిరెడ్డి
దాచేపల్లి కి దానమైతివా!
శేరుశేరు ఎండి మురుగులు
చేతులకూ బెట్టుకోని
కట్టమీదా వస్తావుంటే
కలకశేరనుకొంటిని కొడకా ॥ఓ॥

వయ్యారి కొడకా
బంగారు కొడకా
ధాచేపల్లి కి దానమైతివా ॥ఓ॥

ఆపక్క ఒక చేను
ఈ పక్క ఒక చేను
నడుమ నాపచేను
సందున సిను నలుగురు బట్టి
నరికిరి కొడకా వయ్యారి కొడకా
చిన్నారి కొడకా
దాచేపల్లి కి దానమైతివా ॥ఓ॥

ముందార మూడు బళ్ళు
ఎనకాల ఏడుబళ్ళు
ఏ బండిలో ఉన్నావు కొడకో
బండోడు గురువులన్నా-
తోడోళ్ళు వెంటనేరు
తమ్ముళ్ళు ఎంటనేరు
పాలేళ్ళు ఎంటనేరు
ఒంటారిగాను పోకు
బండోడు గురువులన్నా

నీ బండిమీద ఆన
నీ ఒంటిమీద ఆన
ఒంటరిగాను పోకు
తంటాలు మారివాళ్ళు
బండోడు గురువులన్నా
నీ పంట పొలము తోడు
నీ పాడి పశువు తోడు
ఆ పశు బలము నమ్మబోకు
బండోడు గురువులన్నా!

◆ ◆ ◆

రాజా మా నందిరెడ్డి
నీ కిలలో బత్తెము తీరేనా ॥రా॥

కొడుకా మా నందిరెడ్డి
పుల్లుపంచె కట్టుకోని
నల్లకోటూ తొడుక్కొని
పల్లెగాడనుకొంటిరా
కొడుకా మా నందిరెడ్డి! ॥రా॥

కట్టమీదా పోతావుంటే
కలకటేరనుకొంటిని కొడకా ॥రా॥

నున్నంగా తలదువ్వి
నూగాయ జడవేసి
సందువెంట బోతావుంటే
సందమామనుకొంటిని కొడకా ॥రా॥

వచ్చిపోయే దోవలోనా
దానిమ్మా చెట్టుకిందా
వెండికుచ్చే నేలబడితే
ఏటుకే తెగనరికిరన్నా ॥రా॥

ఓరోరి మల్లన్నా
బొమ్మని పాటి మల్లన్నా
పాలోడై పుడితివిరా
బొమ్మనిపాటి మల్లన్నా
పగదారై పుడితివిరా
బొమ్మనిపాటి మల్లన్నా

నీ తండ్రి చావంగ
నీ తల్లి చావంగ
నా సేతు లేసిరిరా
బొమ్మనిపాటి మల్లన్నా

బండీకీ కట్టుండూ
యల్పటకాడు చంద్రిగాడు
దుమ్మో పాడదిరా
బొమ్మనిపాటి మల్లన్నా

## కోలాటము పాటలు

బోరు బోరు బాగు
డొల్లా కాసోడు కొట్టిన
కక్కూసపు రాళ్ళల్లో
నీ గోరి కట్టిరిరా
బొమ్మనిపాటి మల్లన్నా

